శతద్రుస్తు శతుద్రి (స్స్యాత్)

శతద్రుః-శతుద్రిః ॥స్త్రీ॥ ౨- వసిష్ఠునికి వెఱచి నూఱుపాయలై ప్రవహించిన నది పేళ్లు.

విపాశాతు విపాట్ (స్త్రియామ్)॥ ౨౬౯॥

విపాశా-విపాట్॥శ్॥ ॥స్త్రీ॥౨-వసిష్ఠుని పాశములను విడిపించిన నది పేళ్ళు.

శోణోహిరణ్యవాహః (స్స్యా) త్కుల్యా (ఽల్పాకృత్రిమా సరిత్)

శోణః-హిరణ్యవాహః॥పు॥౨-శోణనదము పేళ్లు.

కుల్యా॥స్త్రీ॥-౧అల్పా=కొంచెమై, కృత్రిమా = త్రవ్వఁబడిన, సరిత్=కాలువ పేరు, A canal.

శరావతీ వేత్రవతీ చన్ద్రభాగా సరస్వతీ॥ [గోదావరీ భీమరథీ కృష్ణవేణీచ గౌతమీ] కావేరీ (సరితో ఽన్యాశ్చ)

శరావతీ - వేత్రవతీ - చన్ద్రభాగా- సరస్వతీ - కావేరీ ॥స్త్రీ॥ ౫ -అన్యాశ్చ= కృష్ణవేణీ గోదావరీ సరయూప్రముఖములు, సరితః=నదీవిశేషములు.

[గోదావరీ - భీమరథీ - కృష్ణవేణీ - గౌతమీ ఈ॥ స్త్రీ॥] అధికపాఠము.

సంభేద స్సిన్ధుసంగమః) ।

సంభేదః ॥పు॥ ౧-నదులయొక్క కూటమి పేరు. The mouth of a river confluence of two rivers.

(ద్వయోః) ప్రణాలీ (పయసః పదవ్యాం)

ప్రణాలీ॥స్త్రీ॥౧-పయసః పదవ్యామ్=గోముఖ మూత్రము మొదలగు జలమార్గము పేరు, A drain.

(త్రిషుతూత్తరౌ)॥ ౨౭౦॥

(దేవికాయాం సరయ్వాంచ భవే) దావిక సారవౌ ।

త్రిషుతూత్తరౌ అని చెప్పఁబడు దావిక సారవశబ్దములు॥త్రి॥ దావికః- సారవః॥ ౨- వరుసగా దేవికానదియందును, సరయునదియందును బుట్టిన వస్తువుల పేళ్లు.

సౌగన్ధికంతు కహ్లారం

సౌగన్ధికమ్- కహ్లారమ్ - (పా) కల్హారమ్ ॥న॥ ౨- ఇంపుగ యెఱుపును మిక్కిలి పరిమళమును గల కలువ పేళ్ళు, The fragrant water-lily.

హల్లకం రక్తసన్ధ్యకమ్ ॥౨౭౧॥

హల్లకమ్- రక్తసన్ధ్యకమ్ ॥న॥ ౨-చెంగలువ పేళ్ళు, The red water-lily.

(స్యా) దుత్పలం కువలయ

ఉత్పలమ్-కువలయమ్॥న॥౨-సామాన్యముగాఁ గలువ పేళ్ళు, Any water-lily.

(మథ) నీలామ్బుజన్మచ । ఇన్దీవరం(చనీలే ఽస్మిన్)

నీలామ్బుజన్మ॥న్॥-ఇన్దీవరమ్॥న॥౨-నల్లకలువ పేళ్ళు, The blue water-lily.

| | |
|---|---|
| (సితే) కుముద కైరవే॥ ౨౭౨॥ | కుముదమ్-కైరవమ్॥న॥ ౨- తెల్లకలువ పేళ్లు, The esculent white water-lily. |
| శాలూక (మేషాం కన్ద స్స్యాత్) | శాలూకమ్॥న॥౧-ఏషామ్- ఈసౌగన్ధికాదుల కెుుక్క, కన్దః స్యాత్ =దుంప పేరు, The root of a water-lily. [pistra stratiotes. |
| వారిపర్ణీతు కుమ్భికా। | వారిపర్ణీ - కుమ్భికా ॥స్త్రీ॥ ౨- నాఁచు పేళ్ళు. |
| జలనీలీ తు శైవాలం శైవలో౽థ | జలనీలీ ॥స్త్రీ॥ - శైవాలమ్॥న॥-శైవలః (పా) శేవలః ॥పు॥ ౩-పాచి పేళ్లు, Moss. |
| కుముద్వతీ ॥౨౭౩॥ కుముదిన్యాం నలిన్యాంతు బిసినీపద్మినీముఖాః । | కుముద్వతీ-కుముదినీ॥స్త్రీ॥ ౨- తెల్లకలువతీఁగె పేళ్లు. నలినీ-బిసినీ-పద్మినీ॥స్త్రీ॥ ఈ౩-ను ముఖము న్నందువలన॥ అబ్జినీ-కమలినీ-సరోజినీ- మొదలైనవియుఁ దామరతీఁగె పేళ్లు, The stalk of a lotus or a collection of lotuses. |
| (వా పుంసి) పద్మం నలిన మరవిన్దం మహోత్పలమ్ । సహస్రపత్త్రం కమలం శతపత్త్రం కుశేశయమ్ । పఙ్కేరుహం తామరసం సారసం సరసీరుహమ్ ॥౨౭౪॥ బిసప్రసూనరాజీవ పుష్కరామ్భోరుహాణి చ। | పద్మమ్॥పు॥- నలినమ్-అరవిన్దమ్ - మహోత్పలమ్-సహస్రపత్త్రమ్- కమలమ్-శతపత్త్రమ్-కుశేశయమ్ - పఙ్కేరుహమ్ - తామరసమ్ - సారసమ్-సరసీరుహమ్-బిసప్రసూనమ్-రాజీవమ్-పుష్కరమ్ - అమ్భోరుహమ్ ॥న॥౧౬- తామర పువ్వు పేళ్లు, A lotus, Nelumblum speciosum. |
| పుణ్డరీకం సితామ్భోజ (మథ) | పుణ్డరీకమ్- సితామ్భోజమ్- ॥న॥ ౨ - తెల్ల తామరపువ్వు పేళ్లు, A white lotus. |
| రక్తసరోరుహమ్॥ రక్తోత్పలం కోకనదం | రక్తసరోరుహమ్- రక్తోత్పలమ్ - కోకనదమ్॥న॥ ౩- ఎఱ్ఱతామరపువ్వు పేళ్ళు, A red lotus. |
| నాలో నాల | నాలః ॥పు॥ (పా) నాళా ॥స్త్రీ॥ నాలమ్ ॥న॥ ౨- తామరకలువ మొదలైనవానికాడ పేళ్లు, The stalk. |
| (మథాస్త్రియామ్)॥ మృణాలం బిస | మృణాలమ్ ॥పు॥-బిసమ్ ॥న॥ ౨- తామర తూండ్ల పేళ్ళు, A lotus-fibre. |

| | |
|---|---|
| (మజ్జాది కదమ్బే) షణ్డమ్ (మస్త్రియామ్) ॥౨౭౭॥ | షణ్డమ్॥ (పా) శణ్డమ్।న్న। ౧ - తామరపువ్వులు మొదలైనవాని సమూహము పేరు, An assemblage of water - lilies. |
| కరహాట శ్శిఫా శ్శిఫా కన్దః | కరహాటః ।పు।-శిఫా ।సీ।-కన్దః ।పు। 3- తామరదుంపపేళ్ళు. శిఫాకన్దః- అని యేకపదమును, The root of lotus. |
| కిఞ్జల్కః కేసరో (౽స్త్రియామ్) । | కిఞ్జల్కః ।పు। కేసరః ।న్న।౨అకరువు పేళ్ళు. A filament. |
| సంవర్తికా నవదలం | సంవర్తికా।సీ।-నవదలమ్।న। ౨ - లేతరేకుల పేళ్ళు, Tender leaves. |
| బీజకోశో వరాటకః॥ [౨౭౮॥ | బీజకోశః- వరాటకః।పు। ౨- తామరపువ్వులోని దుద్దుపేళ్ళు, The seed vessel of the lotus |
| ఇతి వారివర్గః. | ఉదకముతోఁ జేరిన పదసమూహము ముగిసెను. |

ఉక్తం స్వ ర్వ్యోమ దిక్కాలధీవాక్ఛబ్దాది నాట్యకమ్ ।
పాతాల భోగి నరకం వారి చైషాం చ సఙ్గతమ్॥ ౨౭౯॥

టీ. స్వర్వ్యోమదిక్కాలధీ వాక్ఛబ్దాదినాట్యకమ్ - స్వః = స్వర్గమును, వ్యోమ=ఆకాశమును, దిక్=దిక్కును, కాల=కాలమును, ధీ = బుద్ధియు, వాక్=వాక్కును, శబ్దాది=శబ్దములు మొదలైనవియు, నాట్యకమ్=నాట్యమును, పాతాలభోగినరకంవారి చ-పాతాల=పాతాలమును, భోగి=సర్పమును, నరకమ్=నరకమును, వారి=జలమును, ఏషామ్=ఈ స్వర్గాదులయొక్క, సఙ్గతంచ = (వానివానితో) సంబంధించినదియు - సంబంధించిన వస్తువు లనుట, ఉక్తమ్=చెప్పఁబడెను.

ఈ కాండమునందు స్వర్గవర్గు మొదలుగా పండ్రెండువర్గములును, ఆయా వర్గములయందు స్వర్గము మొదలయిన యా యా వస్తువులును, ఆ యా స్వర్గాదివస్తువులతోఁ జేరిన దేవతాదివస్తువులును జెప్పఁబడి యున్న వనుట.

ఇత్యమరసింహకృతౌ నామలిఙ్గానుశాసనే।
స్వర్గాదికాణ్డః ప్రథమ స్సాఙ్గ ఏవ సమర్థితః॥ ౨౮౦

టీ. అమరసింహకృతౌ = అమరసింహుని కృతిగా నుండు, నామలిఙ్గానుశాసనే = నామలిఙ్గానుశాసన మను నిఘంటువునందు, ఇతి = ఈ పూర్వోక్తప్రకారమున, ప్రథమః = మొదటిదైన, స్వర్గాది కాణ్డః = స్వర్గము మొద లయినవానిని దెలియఁజెప్పు భాగము, సాఙ్గ ఏవ = సమగ్రముగానే, సమర్థితః = నెఱవేర్పంబడెను.

నామలిఙ్గానుశాసనము - ప్రథమకాండము.

సంపూర్ణము.



# సటీకామరకోశము — ప్రథమకాండము

## ప ర్యా య ప ద శే ష ము



శ్లో.

36. విభూతిః, Superhuman power consisting in preternatural faculties of eight sorts as below:—
అణిమా, the power of assuming an imperceptible form. మహిమా, the power of increasing one's size at will. గరిమా, the faculty by which one can make himself heavy or great. లఘిమా, the super natural power of assuming excessive lightness at will. ప్రాప్తిః, the power of obtaining any thing. ప్రాకామ్యమ్, the attribute of irresistible will. ఈశిత్వమ్, the power of commanding వశిత్వమ్, the power of subjugating.

75. ఇన్ద్రః-, Regent of East; వహ్నిః, of South-east; పితృపతిః,- of South; నైరృతః, of

శ్లో.

South-west; వరుణః,- of West మరుత్,- of North-west; కుబేరః- of North. ఈశః,- of North-east.

[illegible]2. స్ఫూర్జథుః, The noise attending a stroke of lightning.

115. పక్షాంతౌ, The two last days of half-month.

116. సినీవాలీ, The days on which the moon rises with a scarcely visible crescent.

116. కుహూః, The last day of a lunar month when the moon is invisible.

123. మార్గశీర్షః, month in which the moon is full, nearly in the longitude of Orion's head, తైషః, near the lion's heart. ఫాల్గునః, near the lion's tail. చైత్రః, near the virgin's spike. వైశాఖః, near the southern scale. జ్యేష్ఠః, near the scorpoin.

మూలః, near the bow of Sagittarius. శ్రవణః, nearly in the longitude of the eagle. పభ్గుః, nearly in the longitude of the wing of Pegasus. అశ్విన్యః, near the head of Aries. కృత్తికాః, near the Pleiades.

138. సత్త్వం, The principle of existence which enlightens, constitutes knowledge and in the cause of truth.

రజః, The principle of foulness or passion, which occasions coveting and is the cause of pain. తమః= The principle of darkness which overspreads, and is the cause of error and illusion.

147. రూపం, Colour, figure, శబ్దః, Sound, గంధః, Smell, odour, రసః, Taste flavour. స్పర్శః Touch, contact.

148. పాయుః, The organ of excretion. ఉపస్థం. The organ of generation వాక్, The voice పాణిః, The hand. పాదః, The foot. మనః, The mind, నేత్రం. The eye. జిహ్వా, the tongue, ఘ్రాణం, The nose, త్వక్, The skin శ్రోత్రం, The ear.

166. Preface, Prologue.

173. సోల్లుంఠనం, Ironical taunting. sarcastic.

మణితం, An inarticulate murmuring sound uttered at cohabitation.

213. విలాసః, Change of place, posture, gait or look on the approach of the lover విబ్బోకః, Affection of indifference, విభ్రమః, Wantonness of youth; caprice. లలితం, Languid gestures, and signs, హేలా, Lasciviousness. లీలా, Imitation of the lover's manner to beguile the time in his absence.

224 నాగాః, Demi-gods in human shape with a serpent's tail and dilated neck.

234. విష్టిః, Compulsory and unrewarded labour; or the person executing such labour; casting into hell.

శ్రీరస్తు.

# సటీకామరకోశము

## ద్వితీయకాండము

గ్రంథకర్త చదువువారికి ముందు విషయపరిజ్ఞానము గలుగఁ జేయఁ దలంచి ద్వితీయకాండమునఁ జెప్పు వర్గ యనుక్రమమును సంగ్రహముగాఁ జెప్పుచున్నాఁడు.

వర్గాః పృథ్వీ పుర క్ష్మాభృ ద్వనౌషధి మృగాదిభిః ।
నృబ్రహ్మ క్షత్త్రి విట్ఛూద్రై స్సాఙ్గోపాఙ్గై రిహోదితాః ॥ ౧॥

టీక. ఇహ= ఈభూము కాండమను రెండవ కాండమునందు, స్సాఙ్గోపాఙ్గైః= అంగప్రత్యంగములతోఁ గూడుకొనియున్న, పృథ్వీపురక్ష్మాభృ ద్వనౌషధిమృగాదిభిః= భూపుర శైలవనౌషధి సింహాదులతోడను, నృబ్రహ్మక్షత్త్రి విట్ఛూద్రైః= మనుష్య బ్రహ్మక్షత్త్రియ వైశ్య శూద్రులతోడను, (సేవలక్షితాః= గూడుకొనియున్న) వర్గాః= వర్గలు, ఉదితాః= చెప్పఁబడియున్నవి.

తాత్పర్యము. ఈ కాండమునందు భూవర్గ పురవర్గ శైలవర్గ వనౌషధివర్గ సింహాదివర్గ మనుష్యవర్గ బ్రహ్మవర్గ క్షత్రియవర్గ వైశ్యవర్గ శూద్రవర్గ లని పదివర్గలు నాయా వర్గలయందు నాయా భూమ్యాదిపదార్థములకు నంగములైన మృత్తికాది పదార్థములును, నుపాంగములయిన అశ్వాది పదార్థములును జెప్పఁబడి యున్నవనుట.

భూర్భూమిరచలా౽నన్తా రసా విశ్వమ్భరా స్థిరా। ధరా ధరిత్రీ ధరణిః క్షోణి ర్జ్యా కాశ్యపీ క్షితిః॥ ౨॥ సర్వంసహా వసుమతీ వసుధోర్వీ వసున్ధ

భూః॥ సీ॥ (ప) భూర్ ॥ అన్య॥-భూమిః-అచలా-అనన్తా-రసా-విశ్వమ్భరా-స్థిరా-ధరా-ధరిత్రీ-ధరణిః-(పా) ధరణీ-క్షోణిః (పా) క్షోణీ-జ్యా-కాశ్యపీ-క్షితిః-సర్వంసహా-వసుమతీ-వసుధా-ఉర్వీ-వసున్ధరా-గోత్రా-కుః-పృథివీ (ప) పృథవీ-పృథ్వీ-క్ష్మా-అవనిః-మేదినీ-

| | |
|---|---|
| గా। గోత్రాకుః పృథివీ పృథ్వీ క్ష్మాఽవని ర్మేదినీ మహీః ॥3॥ [విపులా గ హ్వరీ ధాత్రీ గా రిలా సమ్భినీ క్షమా । జగతీ రత్నగర్భాచ భూతధా త్ర్యబ్ధి మేఖలా॥] | మహీః (పా) మహీ ॥సీ॥ ౭ - భూమి పేళ్ళు. Earth. [విపులా- గహ్వరీ-ధాత్రీ-గాః ॥౮॥ -ఇలా- సమ్భినీ-క్షమా-జగతీ-రత్నగర్భా- భూతధాత్రీ- అబ్ధిమేఖలా ।సీ। అధికపాఠము] |
| మృన్మృత్తికా (ప్రశస్తాతు) మృత్స్నా మృత్సాచ (మృత్తికా) । | మృత్ ।ద।- మృత్తికా।సీ।౨-మన్ను పేళ్లు, Soil. మృత్స్నా-మృత్సా ।సీ। ౨-ప్రశస్తా=ప్రశస్తమైన, మృత్తికా=మన్ను, An excellent soil. |
| ఉర్వరా (సర్వసస్యాఢ్యా) | ఉర్వరా ।సీ। ౧- సర్వసస్యాఢ్యా = సకలమయిన సస్యములతోఁగూడియున్న భూమిపేరు, Fertile with crop. |
| (స్యా) దూషః క్షార మృత్తికా॥ | ఊషః ।పు। - క్షారమృత్తికా ।సీ। ౨- చౌటి మన్ను పేళ్ళు, Saline soil. |
| ఊషవా నూషరో | ఊషవాన్ ।త్। ఊషరః ।౨-చవుటినేల పేళ్లు, Barren ground with Saline Soil. |
| (ద్వావ ప్యన్యలిఙ్గా) స్థలం స్థలీ । | ద్వావపి=ఈరెండు శబములును,అన్యలిఙ్గా=విశేష్యముయొక్క లింగములు గలవి. స్థలమ్ ।న।- స్థలీ ।సీ। ౨-తనంతట చదరమైయుండు నేల పేళ్ళు, A place. |
| (సమానౌ) మరు ధన్వానౌ | మరుః-ధన్వా ।న్।పు। ౨-నీళ్లులేనిభూమిపేళ్లు, A region devoid of water. |
| (ద్వే) ఖిలాప్రహతే (సమే) ॥౪॥ త్రి (ష్వథో) జగతీ లోకో విష్టపం భువనం జగత్ । | ఖిలమ్-అప్రహతమ్।త్రి।౨-దున్ననినేల పేళ్ళు. Untilled or waste land. జగతీ ।సీ।-లోకః ।పు।-విష్టపమ్- భువనమ్ - జగత్ ।న। ౫-జగత్తుపేళ్లు, A world. |
| (లోకోఽయం) భారతం వర్షం | భారతం వర్షమ్।న।౧-అయం లోకః=హిమవత్పర్వతమునకు దక్షిణమును, దక్షిణ సముద్రము ... దేశముపేరు. India. |

(శరావత్యాస్తుయో ఉవధేః ।౾। దేశః ప్రాగ్దక్షిణః) ప్రాచ్య

ప్రాచ్యః ।పు। ౧-అవధేః=ఎల్లయయిన, శరావత్యాః=శరావతి యనియెడు నదికి, ప్రాగ్దక్షిణః యః దేశః=తూర్పుతో గూడినదక్షిణ దేశము పేరు శరావతీనది యీశాన్యపు దిక్కుననుండి నైరృతి మూలవడకు పోయి సముద్రమునఁ గలిసియున్న నదియని తెలియవలయును. The south-eastern region.

ఉదీచ్యః (పశ్చిమో త్తరః ।

ఉదీచ్యః ।పు। ౧-ఆనదియే యెల్లగాఁగల, పశ్చిమోత్తరః=పడమరతోఁ గూడిన యుత్తర దేశము పేరు. The north-westen region.

(ప్రత్యన్తో) మ్లేచ్ఛదేశ (స్స్యాత్)

మ్లేచ్ఛదేశః ।పు। ౧-ప్రత్యన్తః=భారతవర్షమునకు తుదనుండు కామరూపాదిప్రత్యంత దేశము పేరు.

A country of barbarians.

(మధ్యదేశ స్తు) మధ్యమః ॥ ౭॥

మధ్యమః ।పు। ౧- మధ్యదేశః=వినశనతీర్థమునకుఁ దూర్పును ప్రయాగకుఁ బడమరయు నైన హిమవద్వింధ్య పర్వతముల మధ్య దేశము పేరు. కురుక్షేత్రము, The middle region.

ఆర్యావర్తః పుణ్యభూమి (ర్మధ్యం విన్ధ్యహిమాగయోః) ।

ఆర్యావర్తః ।పు। -పుణ్యభూమిః ।స్త్రీ। ౨-తూర్పు పడమటిసముద్రము లెల్లగాఁగల విన్ధ్యహిమాగయోః=వింధ్యహిమవత్పర్వతములయొక్క, మధ్యమ్=మధ్య దేశము పేళ్లు, The region of sanctity.

నీవృజ్జనపదౌ దేశ విషయౌ తూపవర్తనమ్ ॥ ౮॥

నీవృత్-జనపదః ।పు। ౨- వాసయోగ్యమైన దేశము పేళ్లు, An inhabited country, దేశః- విషయః ।పు। -ఉపవర్తనమ్ ।న। 3- గ్రామసమూహము పేళ్లు, A country.

(త్రిష్వాగోష్ఠాత్)

ఆగోష్ఠాత్ త్రిషు=ఇది మొదలు గోష్ఠశబ్దము వఱకు నడచుచుండు నామపదములలో విశేష విధి లేనివి ।త్రి।

(న్నడప్రాయే) నడ్వాన్నడ్వల (ఇత్యపి) ।

నడ్వాన్ ।త్రి।-నడ్వలః ।౨-నడప్రాయే=కిక్కసకసవు తఱుచుగాఁగల దేశము పేళ్లు, A country

| | |
|---|---|
| కుముద్వాన్ (కుముద ప్రాయే) | కుముద్వాన్ ।త్। ౧ - కుముద ప్రాయే= తెల్లకలువలు తఱుచుగాఁ గల దేశము పేరు, A country abounding in water-lilies. |
| వేతస్వాన్ (బహు వేతసే॥) ౯॥ | వేతస్వాన్ ।త్। ౧-బహు వేతసే=ప్రబ్బలిచెట్లు తఱుచుగాఁ గల దేశము పేరు, A country abounding in ratans. |
| శాద్వల (శాదహరితే) | శాద్వలః। ౧ - శాదహరితే = లేఁతకసవు చేతఁ బచ్చగా నుండు దేశము పేరు, A country abounding in green grass. |
| (సజమ్బాలేతు) పఙ్కిలః। | పఙ్కిలః।౧- సజమ్బాలే=అడుసుతోఁ గూడిన దేశము పేరు, A clayey and marshy region. |
| (జలప్రాయ) మనూపం (స్యాత్) | అనూపమ్।౧-జలప్రాయమ్=నీళ్లు తఱుచుగా గల దేశము పేరు, A watery or wet countty. |
| (పుంసి) కచ్ఛ (స్తథావిధః)॥ ౧౦॥ | కచ్ఛః।పు।౧-తథావిధః=అట్లునీళ్లుతఱుచుగా గల నదీసరస్సుల సమీప దేశముల పేరు, Contiguous to water. |
| (స్త్రీ) శర్కరాశర్కరిల శ్శార్కర శ్శర్కరావతి। | శర్కరా ।సీ।-శర్కరిలః-శార్కరః-శర్కరావాన్ ।త్। ౪ - మొరముగలదాని పేళ్లు Full of stony nodules. |
| (దేశ ఏవాదిమా) | ఆదిమౌ=మొదటనున్న, శర్కరా శర్కరిలశబ్దములు, దేశే ఏవ=మొరముగల దేశమునకే పేళ్లు. ఏవం=ఇటువలెనే,సికతావతి = ఇసుకగల దేశమునందు, సికతా- సికతిలః-అనియు, ఇసుకగల దానియందు సైకతః - సికతావాన్, అనియు ఉన్నేయౌ=ఊహింపఁదగినవి. Sandy. |
| (వేవ మున్నే యౌస్సి కతావతి)॥ ౧౧॥ | |
| (దేశో నద్యమ్బు వృష్ట్యమ్బు సంపన్న వ్రీహిపాలితః । స్యా) న్నదీమాతృకో దేవమాతృక శ్చ (యథాక్రమమ్)॥ | నదీమాతృకః- Watered from a river. దేవమాతృకః- watered by rain. ఈ రెండును, వరుసగా,నదీజలముచేతను, వర్షజలముచేతను పండునట్టి వరిపైరుగల దేశము పేళ్ళు. |

సురాజ్ఞి— సుంచిరాజుగల,

| | |
|---|---|
| వ్వాన్ (స్యాత్తతో౽న్యత) రాజవాన్ । | దేశే=దేశము పేరు, Ruled by a just king. రాజవాన్॥త్॥ ౧-తతః = ఆ దేశముకంటె, అన్యత్ర=వేఱైన సామాన్యరాజుగల దేశము పేరు, Governed by a king, |
| గోష్ఠం గోస్థానకం | గోష్ఠమ్ - గోస్థానకమ్ ॥న॥ ౨ ఆవు లుండు నుండ పేళ్లు, A fold for kine. |
| (తత్తు) గౌష్ఠీనం భూతపూర్వకమ్) ౧౩॥ | గౌష్ఠీనమ్॥న॥౧-భూతపూర్వకంతత్=పురాతనమైన గోష్ఠము పేరు. The site of a former fold. |
| (పర్యన్తభూః) పరిసరః | పరిసరః ॥పు॥ ౧- పర్యన్తభూః = గ్రామనగరాదులయొక్క- సమీపభూమి పేరు, Skirts, ground contiguous to a town &c. |
| సేతురాలౌ (స్త్రియాం పుమాన్) । | సేతుః ॥పు॥- ఆలిః ॥స్త్రీ॥ ౨- కట్ట పేళ్ళు॥ A dam or mound, a bridge. |
| వామలూరు శ్చ నాకుశ్చ వల్మీకం (పున్నపుంసకమ్) । ౧౪॥ | వామలూరః (పు) వామలూరః-నాకుః॥పు॥ వల్మీకమ్ (పు) వల్మీకమ్ ॥న్న॥ ౩- పుట్ట పేళ్లు, An ant-hill or a mole-hill. |
| అయనం వర్త్మమార్గాధ్వపన్థానః పదవీస్సృతిః సరణిః పద్ధతిః పద్యా వర్తన్యేకపదీతిచ ॥౧౫॥ | అయనమ్-వర్త్మ॥న॥-మార్గః-అధ్వా॥న్॥-పన్థాః ॥న్॥పు॥ - పదవీ - సృతిః- సరణిః - పద్ధతిః- పద్యా - వర్తనీ- ఏకపదీ ॥స్త్రీ॥౧౨- త్రోవ పేళ్ళు. A road, path, or way. |
| అతిపన్థాస్సుపన్థాశ్చ సత్పథ (శ్చార్చితే౽ధ్వని | అతిపన్థాః ॥న్॥ -సుపన్థాః॥న్॥- సత్పథః ॥పు॥, ౩-మంచిత్రోవ పేళ్లు A good road. |
| వ్యధ్వో దురధ్వో విపథః కదధ్వా కాపథ (స్సమాః) । ౧౬॥ | వ్యధ్వః - దురధ్వః - విపథః - కదధ్వా ॥న్॥ కాపథః ॥పు॥ ౫- చెడ్డత్రోవ పేళ్లు. విపథకాపథ శబ్దములు నపుంసకములును, A bad road. |
| అపన్థా స్త్వపథం | అపన్థాః॥న్,పు॥- అపథమ్ ॥న॥౨-తప్పుత్రోవ పేళ్ళు. A worng road or the want of a road. |
| (తుల్యే) శృఙ్గాటక చతుష్పథే । | శృఙ్గాటకమ్-చతుష్పథమ్॥న॥ ౨- నాలుగు త్రోవలు గూడినచోటు పేళ్లు, Crossing of roads. |

ప్రాన్తరం (దూరశూన్యో౾ధ్వా)

ప్రాన్తరమ్ ॥న॥ ౧- దూరశూన్యః అధ్వా= ఎడారియై నడచుట లేని త్రోవ పేరు, A long and lonesome way without trees, water &c.

కాన్తారం (వర్త్మదుర్గమమ్॥ ౧౭॥

కాన్తారమ్ ॥న॥ ౧- దుర్గమం వర్త్మ = చోర కంటకాదులచేత నడువ శక్యముగాని త్రోవ పేరు, A difficult or dangerous road, wilderness.

గవ్యూతిః (స్త్రీ క్రోశయుగం) A league.

గవ్యూతిః ॥స్త్రీ॥౧ క్రోశయుగమ్- రెండుక్రోశముల త్రోవ పేరు. ౨౪అంగుళములు లోకహస్తము,౧౦౦౦ హస్తము లొక క్రోశము. క్రోశమనఁగా కోసు.

నల్వః (కిష్కు చతుశ్శతమ్) A furlong.

నల్వః॥పు॥ ౧- కిష్కు-చతుశ్శతమ్=నన్నూఱు హస్తముల ప్రమాణము గల త్రోవ పేరు.

ఘణ్టాపథ స్సంసరణం

ఘణ్టాపథః॥పు॥-సంసరణమ్॥న॥౨-పదివిండ్లపట్టు గల రాజమార్గము పేరు, Chief road in a village

(తత్పుర)స్యోపనిష్కరమ్॥ ౧౮॥

ఉపనిష్కరమ్ (పా) ఉపనిష్కరమ్ ॥న॥ ౧- పురస్యాగ్రే = దుర్గముగానుండు పురముయొక్క రాజమార్గము పేరు. A high way;

[ద్యావాపృథివ్యౌ రోదస్యౌద్యావా భూమీచరోదసీ। దివస్పృథివ్యౌ

ద్యావాపృథివీ-రోదసీ-ద్యావాభూమిః ॥స్త్రీ॥ రోదః॥స్,న॥-దివస్పృథివీ॥స్త్రీ॥౫-భూమ్యాకాశముల పేళ్ళు. The earth and the sky.

గుఞ్జా తు రుమా (స్యా)ల్లవణాకరః]

గుఞ్జా-రుమా॥స్త్రీ॥-లవణాకరః॥పు॥ 3-చవిటిపఱ్ఱ, ఉప్పళము, A salt marsh; the salt-producing soil.

ఇతి భూమివర్గః.

భూమితోఁ జేరిన పదసమూహము ముగిసెను.

---

పూః (స్త్రీ) పురీ నగర్యౌ (వా) పత్తనం పుటభేదనమ్। స్థానీయం నిగమో

పూః॥ర్,॥స్త్రీ॥-పురీ-నగరీ॥స్త్రీ॥- పత్తనమ్(పా) పట్టణమ్-పుటభేదనమ్-స్థానీయమ్॥న॥ -నిగమః॥పు॥ ౭-పట్టణము పేళ్ళనియొకపక్షము. వీనిలో మొదటిమూఁడు ౧౦౦ గ్రామములవ్యవహారమునకు స్థానమైయుండు ప్రధానపురములకును, కడమ రెండు కోటల యగడ్తలచేత దుర్గములైన పట్టణములకును పేళ్ళనియొకపక్షము A town or city.

| | |
|---|---|
| [ధిష్ణ్యమోకోనివసనం స్థానా౽వసథ వాస్తుచ । సంస్త్యాయమూటజంఘాయనివేశ శ్శరణం క్షయః] | ధిష్ణ్యమ్-ఓకః ॥న॥ - నివసనమ్ - స్థానమ్ - అవసథమ్ - వాస్తు ॥ఉ॥ - సంస్త్యాయమ్ - ఉటజమ్-ఘాయ॥న॥ న॥ - నివేశః ॥పు॥ - శరణమ్ ॥న॥ క్షయః॥పు॥]అధిక పాఠము. |
| వా సః కు టీ (ద్వయోః) శ్శాలా సభా సంజవనం (త్విదమ్) । చతుశ్శాలం | సంజవనమ్-చతుశ్శాలమ్॥న॥౨-నలుదిక్కుల నభిముఖముగా నడుమ నెడము విడిచి కట్టి నయింటి పేళ్ళు, A quadrangle. |
| (మునీనాంత) త్పర్ణశాలోటజో (౽స్త్రియాం) | పర్ణశాలా॥స్త్రీ॥ఉటజః॥పు॥౨-మునీనాంతత్ = మునులయొక్కయింటి పేళ్లు, A hermitage, a hut. |
| చైత్యమాయతనం (తుల్యే) | చైత్యమ్-ఆయతనమ్-॥న॥౨-యజ్ఞశాల పేళ్ళు, బౌద్ధాలయ మనియు రచ్చచెట్టనియుం గొందఱు, An altar; a monument, a sacred tree. |
| వాజిశాలా తు మన్దురా । | వాజిశాలా - మన్దురా ॥స్త్రీ॥ ౨ - గుఱ్ఱపుశాల పేళ్ళు, A stable [కొట్టము, A workshop. |
| ఆవేశనం శిల్పిశాలా ప్రపా పానీయశాలికా॥ | ఆవేశనమ్॥న॥-శిల్పిశాలా ॥స్త్రీ॥ ౨ - కమసాల ప్రపా - పానీయశాలికా॥స్త్రీ॥౨-చలిపందిరి పేళ్లు, A place of refreshment. |
| మఠ (శ్ఛాత్త్రాదినిలయో) | మఠః ॥పు॥ ౧-ఛాత్త్రాదినిలయః = శిష్యులు సన్న్యాసులు మొదలగువారి గృహము పేరు. A convent of ascetics; A school of students. |
| గఞ్జా తు మదిరా గృహమ్ । | గఞ్జా॥స్త్రీ॥-మదిరాగృహమ్ ॥న॥ ౨-మద్యము చేయు నింటి పేరు, A tavern. |
| గర్భాగారంవాసగృహ | గర్భాగారమ్-వాసగృహమ్॥న॥౨-పడకటిల్లు మొదలైనయింటిలోపలిభాగము పేళ్లు, An inner and private room. ఇందు మొదటిది దేవునిగర్భగృహ మని కొందరు. |
| మరిష్టం సూతికాగృహమ్ ॥౨౬॥ [కుట్టిమో౽స్త్రీనిబద్ధా భూశ్చన్ద్రి | అరిష్టమ్ - సూతికాగృహమ్ ॥న॥ ౨ - పురిటింటి పేళ్ళు, The lying-in-chamber. [కుట్టిమః॥పు॥౧-తాపికట్టుడపు నేల. చన్ద్రి |

| | |
|---|---|
| శాలా శిరోగృహమ్] | శాలా॥స్త్రీ॥- శిరోగృహమ్॥న॥ ౨-పై మేడపేళ్లు. An apartment on the house top.] [A window. |
| వాతాయనం గవాక్ష (స్స్యా) న్మణ్డపో (ఽస్త్రీ) జనాశ్రయః । | వాతాయనమ్॥న॥-గవాక్షః॥పు॥ ౨- కిటికీలపేళ్లు. మణ్డపః॥పు॥ జనాశ్రయః॥పు॥ ౨- ఆస్థానము మొదలయిన మండపము పేళ్ళు, A temporary hall; a sanctuary. |
| హర్మ్యాది (ధనినాం వాసః) | హర్మ్యమ్॥న॥ ౧-ధనినామ్=ధనికులయొక్క, వాసః = గృహము పేరు, ఆదిశబ్దముచేత అట్టాలకాదినామములును గలవు. The abode of the wealthy. A grand edifice. |
| ప్రాసాదో (దేవ భూభుజామ్)॥ ౨౭॥ | ప్రాసాదః॥పు॥౧- దేవభూభుజామ్= దేవగృహము లేక రాజగృహము, A temple or palace. |
| సౌధో(ఽస్త్రీ) రాజసదన ముపకార్యోపకారికా । | సౌధః॥పు॥- రాజసదనమ్॥న॥-ఉపకార్యా-ఉపకారికా॥స్త్రీ॥ ౪- రాజగృహము పేళ్ళు; A royal residence. ఉపకార్యోపకారికా శబ్దములు గుడారము పేళ్ళని కొందఱు, A tent. |
| స్వస్తిక స్సర్వతోభద్రో నన్ద్యావర్తాదయో (ఽపిచ) ॥౨౮॥ విచ్ఛన్దకః (ప్రభేదాహి భవన్తీశ్వరసద్మనామ్) | స్వస్తికః-సర్వతోభద్రః-నన్ద్యావర్తః-విచ్ఛన్దకః॥పు॥ ౪ - ఆదిశబ్దముచేత రుచిక వర్ధమానములు మొదలైనవియు, ఈశ్వరసద్మనామ్=రాజ దేవగృహముల, ప్రభేదాః = ద్వారభేదాదిభేదములచేఁ బుట్టిన రచనావిశేషములు, భవన్తి=అగుచున్నవి. |
| (స్త్ర్యగారం భూభుజా) మన్తఃపురం (స్యా) దవరోధనమ్ ॥౨౯॥ శుద్ధాన్త శ్చావరోధ శ్చ | అన్తఃపురమ్-అవరోధనమ్॥న॥- శుద్ధాన్తః- అవరోధః॥పు॥౪- భూభుజామ్=రాజులయొక్క, స్త్ర్యగారమ్=స్త్రీలున్న యింటిపేరు. Seraglio; harem. |
| (స్యా) దట్టః క్షౌమ (మస్త్రియామ్) A fortified place in front of a building. | అట్టః॥పు॥-క్షౌమమ్-(పా)క్షోమమ్॥న॥ ౨- యుద్ధము చేయుటకయి వాకిట మణ్డపముమీఁదఁ గాని, కోటగోడమీఁదఁగాని కట్టినయుండ్ల పేళ్ళని కొంద ఱందురు. మేడలకు వెనుకదిక్కున కట్టియుండు గృహము పేళ్ళని కొంద ఱందురు. |

| | |
|---|---|
| ప్రఘణ ప్రఘణాలిన్దా బహిర్ద్వార ప్రకోష్ఠకే। | ప్రఘాణః ప్రఘణః-అలిన్దః(పా) ఆలిన్దః ॥పు॥ 3-తలవాకిటి ముందఱిమండు ప్రకోష్ఠము పేళ్లు, A terrace before the house door; portico. |
| గృహావగ్రహణీ దేహ | గృహావగ్రహణీ- దేహాలీ॥సీ॥౨-గడప పేళ్ళు. The threshold- [ముంగిలి పేళ్లు, A court or yard. |
| అఙ్గణం చత్వరాజిరే। (అధస్తాద్దారుణి) శిలా | అఙ్గణమ్(పా)అఙ్గనమ్- చత్వరమ్- అజిరమ్॥న॥ 3- శిలా సీ॥౧-అధస్తాద్దారుణి=గడప క్రిందిలోనిన్యు మాని, అడ్డకమ్మి, The lower timber of a gate. |
| నాసా (దారూపరిస్థితమ్)॥ ౩౦॥ | నాసా॥సీ॥ ౧ ఉపరిస్థితమ్ దారు=గడపకు పైనుండు మాను; లక్ష్మీకమ్మి, The upper timber. |
| ప్రచ్ఛన్నమన్తర్ద్వారం (స్యాత్) | ప్రచ్ఛన్నమ్-అన్తర్ద్వారమ్॥న॥౨-లోపలి వాకిటి పేళ్ళు, A private door. [A back door. |
| పక్షద్వారంతు పక్షకః। | పక్షద్వారమ్॥న॥-పక్షకః॥పు॥ ౨-దిడ్డివాకిలి పేళ్లు. |
| వలీక నీధ్రే పటల ప్రాన్తే(ఽథ) | వలీకమ్ - నీధ్రమ్ - పటలప్రాన్తమ్ ॥న॥ 3- చూరుకొనగ పేళ్ళు, The edge of the thatch. |
| పటలం ఛదిః॥ ౩౧॥ | పటలమ్-ఛదిః॥న్,సీ॥ ౨- కప్పు పేళ్ళు. Roof |
| గోపానసీ (తు వలభీచ్ఛాదనే వక్రదారుణి) | గోపానసీ ॥సీ॥ ౧- వలభీచ్ఛాదనే = కొనగ కాధారమైన పట్టెను గప్పుచున్న, వక్రదారుణి = వంకరమ్రానిపేరు. కొందఱు గోపానసీవలభిశబ్ధములు రెండును గృహమునకు కప్పైన వక్రదారువు పేళ్ళందురు, The wood of a thatch. |
| కపోతపాలికాయాం తు విటఙ్కం (పుంనపుంసకమ్) ౩౨॥ | కపోతపాలికా ॥సీ॥- విటఙ్కమ్॥పున్న॥ ౨- హర్మ్యవిహారస్థానాదుల ముంగిట జతురమైన పక్షులుండు ప్రమానుపేళ్ళు, A viary or dovecot- |
| (స్త్రీ) ద్వార్ద్వారం ప్రతీహారః | ద్వాః॥ర్,సీ॥ ద్వారమ్॥న॥- ప్రతీహారః॥పు॥ 3-వాకిటి పేళ్లు, A gate ; entrance. [seat. |
| (స్యా) ద్వితర్దిస్తు వేదికా। | వితర్దిః-వేదికా॥సీ॥ ౨-అరుగు పేళ్ళు, A raised |
| తోరణో(ఽఽ స్త్రీ) బహిర్ద్వారమ్ | తోరణః॥పున్న॥ - బహిర్ద్వారమ్॥న॥౨- పుష్పమాలికాదులు గట్టుటకొఱకు గృహము వెలుపల |

(పురద్వారంతు) గోపురమ్ । 34
(కూటం పూర్ద్వారి యత్) ద్ధస్తినఖ (స్తస్మిన్)
(స్యాత్తోరణో బహిర్ద్వారం) ।
(స్యాత్కపాటో ఽ) కపాటమరరం (తుల్యే)
తద్విష్కమ్భ ఉర్గళం (నపుం)
ఆరోహణం (స్యాత్) సోపానం 35
నిశ్రేణి స్త్వధిరోహిణీ ।
సమ్మార్జనీ శోధనీ (స్యాత్)
సఙ్కరో ఽవకర (స్తథా॥ 36॥ క్షిప్తే)
ముఖం నిస్సరణమ్
సన్నివేశో నికర్షణమ్
(సమౌ) సంవసథ గ్రామౌ
వేశ్మభూ ర్వాస్తు(రస్త్రియామ్)॥ 37
గ్రామాన్త ముపశ

స్తంభద్వయముతోఁ గట్టఁబడిన ద్వారము పేరు. The outer gate, an ornamental arch.

గోపురమ్ ॥న॥ ౧ - పురద్వారమ్=పట్టణపు వాకిటి పేరు. A city gate or temple gate.

హస్తినఖః ॥పు॥ ౧-పట్టణపు వాకిట శత్రువులు గొబ్బున రాకుండ నిమ్నోన్నతముగా వేసిన కంటిబిన్నె పేరు. A turret protecting the approach to the gate of a city or fort.

కవాటమ్ (పా) కపాటమ్- అరరమ్॥త్రి॥౨-తలుపు పేర్లు, A door.

అర్గలమ్॥న॥ ౧-తద్విష్కమ్భే = ఆ తలుపు యొక్క గడియ మ్రాని పేరు, Door-bolt or bar

ఆరోహణమ్-సోపానమ్॥న॥ ౨-సోపానముల పేర్లు, Stairs, steps of a staircase.

నిశ్రేణిః- అధిరోహిణీ ॥స్త్రీ॥ ౨-నిచ్చెన పేర్లు, A ladder.

సమ్మార్జనీ-శోధనీ ॥స్త్రీ॥ ౨- చీఁపురుకట్ట పేర్లు. A broom.

సఙ్కరః అవకరః॥పు॥ ౨- తథా =ఆచీఁపురు కట్టచే, క్షిప్తే=తుడువఁబడిన ధూళి మొదలైన దాని పేర్లు, Dust or sweepings.

ముఖమ్-నిస్సరణమ్॥న॥౨-ఇంటివాకిట నుండు ప్రదేశము పేర్లు, The entrance of a house.

సన్నివేశః ॥పు॥-నికర్షణమ్॥న॥ ౨- పట్టణము చుట్టువారిన బయలు పేర్లు, An open space in a town or village.

సంవసథః-గ్రామః ॥పు॥౨-గ్రామము పేర్లు, A village.

వేశ్మభూః॥స్త్రీ॥-వాస్తుః॥పు॥ ౨- ఇల్లుగట్టుటకు యోగ్యమైయున భూమి పేర్లు, Building-ground, The site of a habitation.

గ్రామాన్తమ్ - ఉపశల్యమ్ ॥న॥ ౨-గ్రామా

ల్యం (స్యాత్) । సీమసీమే (స్త్రియా ముభే) ।

సమీపప్రదేశముల పేళ్లు, Space near a village

సీమా॥న్॥-సీమా॥ఆ,సీ॥ ౨-పొలిమేరగుఱుతు పేళ్ళు, The boundary or limit.

ఘోష ఆభీరపల్లీ (స్యాత్)

ఘోషః॥పు॥-ఆభీరపల్లీ॥సీ॥ ౨-గొల్లపల్లె పేళ్ళు, A station of cow-herds.

త్పక్కణ శ్శబరాలయః॥

పక్కణః-శబరాలయః ।పు। ౨-బోయపల్లె పేళ్ళు, The abode of the lowest men.

ఇతి పురవర్గః.

పట్టణముతోఁ జేరిన పదసమూహము ముగిసెను.

---

మహీధ్రే శిఖరి క్ష్మాభృ దహార్యధర పర్వతాః ॥ అద్రి గోత్ర గిరిగ్రావాచల శైల శిలోచ్చయాః ।౩౯। లోకాలోక శ్చక్రవాల

మహీధ్రః-శిఖరీ॥న్॥క్ష్మాభృత్ - అహార్యః-ధరః-పర్వతః-అద్రిః-గోత్రః-గిరిః- గ్రావా ॥న్॥ అచలః-శైలః-శిలోచ్చయః॥పు।౧౩-కొండపేళ్లు, A mountain or hill.

లోకాలోకః-చక్రవాలః ।పు। ౨-భూమికిఁ గోటవలెఁ జుట్టుకొనియుండు పర్వతము పేళ్లు. A range surrounding the earth.

స్త్రికూట స్త్రికకు (త్సమౌ)

త్రికూటః-త్రికకుత్ ।ద్।పు। ౨-త్రికూట పర్వతము పేళ్లు, A hill with three peaks.

అస్తస్తు చరమక్ష్మాభృ దుదయః పూర్వపర్వతః ॥౪౦॥

అస్తః - చరమక్ష్మాభృత్ ।పు। ౨- అస్త పర్వతము పేళ్ళు The western mountain.

ఉదయః - పూర్వపర్వతః ।పు। ౨- ఉదయ పర్వతము పేళ్లు, The eastern mountain.

హిమాలయో నగాధిరాజ స్స్యా న్మలయ శ్చన్దనాలయః॥)

హిమాలయః- అద్రిరాజః ।పు। ౨ హిమవత్పర్వతము పేళ్ళు, మలయః- చన్దనాలయః ।పు। ౨-మలయపర్వతము పేళ్లు.

హిమవాన్నిషధో విన్ధ్యో మాల్యవాన్ పారియాత్రికః। గన్ధమాదన మన్యేచ హేమకూటాదయో నగాః ॥౪౧॥

హిమవాన్ ।త్। నిషధః-విన్ధ్యః - మాల్యవాన్ ।త్। - పారియాత్రికః-।పు।-గన్ధమాదనమ్ ।న। ౬-మఱియు హేమకూటము మొదలైనవి ప్రత్యేక పర్వతములు.

పాషాణ ప్రస్తర గ్రావో పలాశ్మాన శ్శిలా దృషత్ ।

పాషాణః - ప్రస్తరః - గ్రావా॥న్॥ - ఉపలః - అశ్మా॥న్॥పు॥- శిలా - దృషత్ - (పా)దృశత్॥ ద్॥స్త్రీ॥ ౭-రాతిపేళ్ళు, A stone or rock.

కూటో (ఽస్త్రీ) శిఖరం శృఙ్గం

కూటః॥పు॥-శిఖరమ్॥న॥-శృఙ్గమ్॥న॥ 3- పర్వతశిఖము పేళ్ళు, A peak or summit.

ప్రపాతస్తు తటో భృగుః॥ ౪౨॥

ప్రపాతః-తటః-భృగుః॥పు॥ 3-కొండచఱియపేళ్లు, A precipice : a slope.

కటకో (ఽస్త్రీ)నితమ్బోఽద్రేః)

కటకః॥న॥౧-అద్రేః నితమ్బః=కొండనడుము పేరు, The side or ridge of a mountain.

స్నుః ప్రస్థ స్సాను (రస్త్రీయామ్) ।

స్నుః - ప్రస్థః॥పు॥ సానుః॥న॥3- పర్వతము యొక్క సమమయిన భూమి పేళ్ళు, Table-land.

ఉత్సః ప్రస్రవణం

ఉత్సః॥పు॥ప్రస్రవణమ్॥న॥ ౨ - కొండయూట పేళ్ళు, A fountain or spring.

వారి ప్రవాహో నిర్ఝరో ఝరః। ౪౩।

వారిప్రవాహః-నిర్ఝరః - ఝరః॥పు॥- (పా) ఝరీ॥స్త్రీ॥3-కొండయందుఁబుట్టినజలప్రవాహము, A cascade. water - fall.

దరీతు కన్దరో (వాస్త్రీ) (దేవఖాతబిలే)గుహా। గహ్వరం

దరీ॥స్త్రీ॥ కన్దరః॥న॥౨-పర్వతబిలముపేళ్లు, [An artificial cave. గుహా॥స్త్రీ॥- గహ్వరమ్॥న॥- ౨ - దేవఖాత బిలే= దేవతలచేతఁ ద్రవ్వంబడిన బిలము పేళ్ళు, A natural cave, a den.

గణ్డశైలా(స్తుచ్యుతాః స్థూలోపలాగిరేః) ।౪౪।

గణ్డశైలాః॥పు॥ ౧-గిరేః = పర్వతమునుండి, చ్యుతాః=జాఱిన, స్థూలోపలాః=గొప్పరాళ్లపేరు Huge rocks fallen form a mountain.

ఖనిః (స్త్రీయా మాకరః (స్యాత్)

ఖనిః (ప) ఖానిః॥స్త్రీ॥-ఆకరః॥పు॥ ౨- లోహ రత్నాదులు పుట్టు గనిపేళ్ళు, A mine.

పాదాః ప్రత్యన్త పర్వతాః ।

పాదాః-ప్రత్యంతపర్వతాః॥పు॥౨-పెద్దకొండ సమీపమునందుఁ బుట్టుకొనియున్న తిప్పలపేళ్లు,

Hillocks near a mountain.

ఉపత్యకా (ఽద్రే)

ఉపత్యకా॥స్త్రీ॥౧-అద్రేః=పర్వతముయొక్క

రాసన్నా భూమి)

ఆసన్నా భూమిః=సమీపమైన కింది తట్టి భూమి పేరు, Land near the foot of a mountain-

(రూర్ధ్వ) మధిత్యకా॥ ౪౫॥

అధిత్యకా॥ సీ॥ ౧-ఊర్ధ్వమ్=పర్వతముయొక్క, మీఁది భూమి పేరు, Land on a mountain-

ధాతు (ర్మనశ్శిలా ద్యద్రేః)

ధాతుః ॥పు॥ ౧-అద్రేః=పర్వతముయొక్క, మనశ్శిలా = మణిశిలాళము, అది = మొదలయిన శిలావికారముల కన్నిటికిని సామాన్యనామము. A mineral or fossil, [Red chalk

గైరికం (తు విశేషతః)।

గైరికమ్ ॥న॥ ౧ - జాతి విశేషనామము,

నికుఞ్జ కుఞ్జౌ (వా క్లీబె లతాది పిహితోదరే)॥ ౪౬॥

నికుఞ్జః-కుఞ్జః॥ పు॥ ౨- లతాదిపిహితోదరే= తీఁగె మొదలయిన వానిచేతఁ గప్పఁబడిగృహము వలె నున్న పొదల పేళ్ళు, A bower: a place overgrown with creepers &c.

ఇతి శైలవర్గః

పర్వతములతోఁ జేరిన పదసమూహము ముగిసెను.

---

అటవ్యరణ్యం విపినం గహనం కాననం వనమ్। A grove.

అటవీ॥సీ॥-అరణ్యమ్-విపినమ్-గహనమ్-కాననమ్-వనమ్ ॥న॥ ౬- అడవి పేళ్ళు, కాననవనశబ్దములతోఁ దోటకును పేళ్ళని కొందఱందురు, A forest

మహారణ్య మరణ్యానీ

మహారణ్యమ్ ॥న॥౬-అరణ్యానీ ॥సీ॥ ౨-దొడ్డయడవి పేళ్ళు, A large forest.

గృహారామ స్తు నిష్కుటః॥ ౪౭॥

గృహారామః-నిష్కుటః ॥పు॥ ౨-ఇంటిచేరువ నున్న తోఁట పేళ్ళు, A grove near a house.

ఆరామ (స్స్యా) దుపవనం (కృత్రిమం వన మేవ తత్)।

ఆరామః॥పు॥-ఉపవనమ్॥న॥౨-కృత్రిమమ్= మనుష్యులు పెట్టిన: తద్వనమ్=ఆ వనము పేళ్ళు, A garden.

అమాత్య గణికా గేహోపవనే) వృక్షవాటికా॥ ౪౮॥

వృక్షవాటికా ॥సీ॥ ౧ - అమాత్యగణికా గేహోపవనే = ప్రధానులయొక్కయు, వేశ్యలయొక్కయు ఇండ్లలోపలి తోఁట పేరు.

(పుమా) నాక్రీడ ఉద్యానం (రాజ్ఞస్సాధా

ఆక్రీడః॥పు॥-ఉద్యానమ్॥న॥౨-సాధారణమ్= సకలజనులకు సాధారణమయిన, రాజ్ఞః = రాజు

రమణం వనమ్) ।

యొక్క, వనమ్=ఉపవనము పేళ్ళు, A public park.

(స్యాదేతదేవ) ప్రమదావన (మన్తఃపురోచితమ్॥ ౪౯॥

ప్రమదావనమ్ [పా] ప్రమదవనమ్ ॥న॥ ౧- అన్తఃపురోచితమ్=అంతఃపురమునకు మాత్ర ముచితమైన, ఏతదేవ = ఈరాజుతోఁట పేరు. A royal pleasure garden.

వీథ్యాలి రావలిః ప ఙ్క్తి శ్రేణీ

వీథిః-ఆలిః-ఆవలిః - పఙ్క్తిః-శ్రేణీ ॥స్త్రీ॥ ౫- పంక్తిమాత్రము పేళ్ళు, A row or range.

రేఖాస్తు రాజయః॥

రేఖా (పా) లేఖా-రాజిః ॥స్త్రీ॥ ౨- ఎడతెగక దట్టమైన పంక్తి పేళ్ళు, A continuous line.

వన్యా (వనసమూహే స్యా)

వన్యా ॥స్త్రీ ౧ - వనసమూహము పేరు, A multitude of groves.

దఙ్కురోఽభినవోద్భిది॥ ౫౦॥

అఙ్కురః [వ] అఙ్గూరః-అభినవోద్భిత్ ॥ద్॥పు॥ ౨-క్రొత్త మొలక పేళ్ళు, A germin or sprout.

వృక్షో మహీరుహశ్శాఖీవిటపీ పాదప స్తరుః। అ నోకహః కుటస్సాలః ప లాశీ ద్రుద్రుమాగమాః॥

వృక్షః-మహీరుహః-శాఖిన్॥- విటపీ (న్)- పాదపః - తరుః-అనోకహః-కుటః-సాలః-పలాశీ॥ న్॥-ద్రుః-ద్రుమః- అగమః॥ పు॥౧౩- వృక్షము పేళ్ళు, A tree.

వానస్పత్యః (ఫలైః పుష్పాత్)

వానస్పత్యః ॥పు॥ ౧-పుష్పాత్=పుష్పమువల నంబుట్టిన, ఫలైః=ఫలములతోఁగూడిన మామిడి మొదలయిన వృక్షముల పేరు. A tree fructifying from blossoms; as the mango &c.

(తైరపుష్పా) ద్వనస్పతిః।

వనస్పతిః ॥పు॥ ౧-అపుష్పాత్=పువ్వులు లేక కలిగినఫలములతోఁ గూడిన పనస మొదలయిన వృక్షముల పేరు, A tree fructifying without apparent blossoms: As the bread-fruit &c.

ఓషధ్యః (ఫలపాకాన్తాః)

ఓషధ్యః॥స్త్రీ॥ ఫలపాకాన్తాః=పండుచునే నశించు అరఁటి, వరి మొదలైనవాని పేరు, An annual plant.

(స్యా) దవన్ధ్యః ఫలేగ్రహిః॥ ౫౨

అవన్ధ్యః-ఫలేగ్రహిః॥ ౨-గొడ్డుపోక ఫలించు మ్రాఁకు పేళ్ళు, Fruitful.

వన్ధ్యో౽ఫలో౽వకేశీ చ

వన్ధ్యః-అఫలః-అవకేశీ ॥న్॥ ౩-గొడ్డుమ్రాని పేళ్ళు. Barren fruitless.

ఫలవాన్ ఫలినః ఫలీ।

ఫలవాన్ ॥త్॥-ఫలినః- ఫలీ॥న్॥ ౩-తత్కాలమునం బండియున్నమ్రాని పేళ్ళు, Bearing fruit.

ప్రఫుల్లోత్ఫుల్ల సంఫుల్ల వ్యాకోశ వికచ స్ఫుటాః ॥౫౩॥ ఫుల్ల (శ్చైతే) వికసితే

ప్రఫుల్లః-ఉత్ఫుల్లః-సంఫుల్లః - వ్యాకోశః-(పా) వ్యాకోశః-వికచః-స్ఫుటః-ఫుల్లః, వికసితః॥ ౮ - వికసించినదాని పేళ్ళు, Blown as a flower.

స్యు రవన్ధ్యాదయ (స్త్రిషు)।

అవంధ్యశబ్దము మొదలు వికసితశబ్దముదనుకు నన్ని శబ్దములును త్రిలింగములు.

స్థాణు(ర స్త్రీ) ధ్రువ శ్శఙ్కుః

స్థాణుః॥న్న॥-ధ్రువః-శఙ్కుః॥పు॥ ౩ మోడు పేళ్ళు, The trunk of a Iopped tree.

(హ్రస్వశాఖాశిఫః) క్షుపః। ౫౪

క్షుపః॥ పు। ౧ - కుఱుచకొమ్మలును ఊడలును గలిగియున్న గుజ్జుమ్రాఁకు పేరు. A small tree with short branches.

(అప్రకాణ్డే) స్తమ్బ గుల్మౌ

స్తమ్బః-గుల్మః॥పు॥౨-ప్రకాండము లేక ఆకులు తెఱచుగాఁగలదాని పేళ్ళు. ప్రకాండమన వేళ్లకును కొమ్మలకును నడుమ నుండుభాగము, A shrub.

వల్లీతు వ్రతతి ర్లతా।

వల్లీ(ప) వల్లిః-వ్రతతిః-లతా॥స్త్రీ। ౩- తీగపేళ్ళు A creeper.

(లతా ప్రతానినీ)వీరు ద్గుల్మిన్యులప ఇత్యపి॥ ౫౫॥

వీరుత్ ॥ద్॥-గుల్మినీ॥స్త్రీ॥-ఉలపః॥పు॥ ౩ - తీఁగెల గుంపు గలపొద పేళ్ళు, ఆకులసమూహము గల తీఁగె పేళ్ళని కొందఱు, A spreading creeper.

(నగాద్యారోహ)ఉచ్ఛ్రాయ ఉత్సేధ శ్చోచ్ఛ్రయశ్చ (సః)।

ఉచ్ఛ్రాయః-ఉత్సేధః-ఉచ్ఛ్రయః॥ పు॥ ౩- నగాద్యారోహః = పర్వతాదుల పొడవు పేళ్ళు, The height of a tree, hill &c.

అ(స్త్రీ) ప్రకాణ్డస్స్కన్ధ (స్స్యాన్మూలాచ్ఛాఖావధేస్తరోః) ॥౫౬॥

ప్రకాణ్డః॥న్న॥-స్కన్ధః॥పు॥౨- మూలాత్ - వేరు మొదలు, శాఖావధేః = కొమ్మలవరకుఁ గల, తరోః= చెట్టుయొక్క- మధ్యభాగము, The trunk.

(సమే) శాఖాలతే

శాఖా-లతా॥స్త్రీ॥౨-కొమ్మపేళ్ళు A branch.

స్కన్ధశాఖా శాలే — స్కన్ధశాఖా-శాలా ॥స్త్రీ॥ ౨ - మ్రాని మొదటి కొమ్మ పేళ్ళు, A principal branch.

శిఫా జటే। — శిఫా-జటా॥స్త్రీ॥౨-చెట్టు మొదటియూడల పేళ్లు A fibrous root.

(శాఖాశిఫా)ఽవరోహః (స్యాన్మూలాచ్ఛా (గ్రంగతా లతా)॥౫౭॥ — అవరోహః॥పు॥౧-శాఖాశిఫా=చెట్టుకొమ్మల యందలి యూడలకును, మూలాత్ = చెట్టు మొదటనుండి, అగ్రమ్ = కొనవరకు, గతా = పోయిన,లతా=తీగెకును పేరు, A scandent fibre.

శిరో౽గ్రంశిఖరం (వానా) — శిరః॥స॥-అగ్రమ్॥న॥-శిఖరమ్॥వ్న॥౩ - చెట్టు కొన పేళ్ళు, The top or crown of a tree.

మూలం బుధ్నో౽ఙ్ఘ్రినామకః। — మూలమ్॥ న॥-బుధ్నః (పా) అఙ్ఘ్రినామకః॥పు॥౩-చెట్టు మొదటి పేళ్ళు. The root

సారో మజ్జా (సమౌ) — సారః-మజ్జా ॥న్, పు॥ (వ)మజ్జా॥స్త్రీ॥ ౨-చెటులో నుండు చేవ పేళ్ళు. The pith

త్వక్ (స్త్రీ) వల్కంవల్కల (మస్త్రియామ్)॥ — త్వక్॥చ్, స్త్రీ॥ - వల్కమ్-వల్కలమ్॥వ్న॥ ౩-నార పేళ్ళు, The bark.

కాష్ఠం దార్విన్ధనం త్వేధ ఇధ్మ మేధ స్సమిత్ (స్త్రియామ్) — కాష్ఠమ్-దారు॥న॥౨-కొయ్య పేళ్ళు, Wood. ఇన్ధనమ్ - ఏధః॥స్॥ న॥ -ఇధ్మమ్ ॥న॥-ఏధః॥ పు॥-సమిత్ ॥ ధ్, స్త్రీ॥ ౫-సమిధల పేళ్ళు, Fuel.

నిష్కుహః కోటరం (వానా) — నిష్కుహః ॥పు॥ -కోటరమ్॥ వ్న॥౨ - మ్రాని తొఱ్ఱ పేళ్ళు. The hollow of a tree.

వల్లరీ మఞ్జరీ (స్త్రియౌ)॥ ౫౮॥ — వల్లరీ- మఞ్జరీ॥స్త్రీ॥౨-పువ్వుల గుత్తికిఁగాని, పూచినకొమ్మకుఁగాని పేళ్ళు.ఇవిఙకారాంతములును. A flower-stalk; a compound. pedicel.

పత్త్రంపలాశంఛదనం దలం పర్ణం ఛదః (పుమాన్)। — పత్త్రమ్-పలాశమ్-ఛదనమ్-దలమ్- పర్ణమ్॥ న॥-ఛదః॥పు॥ ౬-ఆకుల పేళ్ళు, A leaf; foliage.

పల్లవో (౽స్త్రీ) కిసలయం — పల్లవః॥ వ్న॥-కిసలయమ్॥న॥౨-చిగురు పేళ్ళు, ఆకులతోఁ గూడిన గంటు పేళ్ళని కొందఱందురు. A sprout or shoot. A twig full of young leaves

విస్తారో విటపో(౽)స్త్రి — విస్తారః ॥పు॥ - విటపః ॥వ్న॥ ౨- కొమ్మలు,

| | |
|---|---|
| యామ్)॥ ౬౦ | చిగుళ్ళు మొదలయిన వాని సమూహము పేళ్ళు, The branch & its shoot. |
| (వృక్షాదీనాం ఫలం) సస్యం | సస్యమ్(పా)శస్యమ్॥న॥ ౧-వృక్షములు మొదలయినవానిఫలము పేళ్ళు, Fruit: crops; harvest |
| వృన్తం ప్రసవబన్ధనమ్। | వృన్తమ్-ప్రసవబన్ధనమ్-॥న॥౨-తొడిమ పేళ్ళు, The foot stalk of a leaf or fruit; the peduncle. |
| (అమే ఫలే) శలాటుః | శలాటుః॥త్రి॥౧-పండనికాయ, Unripe fruit |
| (శుష్కే) వాన (ముక్తత్రిషు) ॥౬౧॥ | వానమ్॥త్రి॥ ౧- ఎండుకాయపేరు, Dried fruit. |
| క్షారకో జాలకం(క్లీబే) | క్షారకః॥ పు॥ -జాలకమ్॥ న॥ ౨ -క్రొందలువసరు మొగ్గలకును- క్రొందలు వసరుకాయలకును, క్రొందలు మొగ్గల గుమికిని పేళ్ళని చెప్పిరి. A bud or germ. |
| కలికాకోరకౌ(ఉ(స్త్రీ)యామ్। | కలికా ॥స్త్రీ॥ -కోరకః॥ పు॥ ౨ - ఇంచుకంతవృద్ధి నొందిన మొగ్గలపేళ్ళు, An unblown flower. |
| (స్యా) ద్గుచ్ఛకస్తబకః | గుచ్ఛకః- స్తబకః॥పు॥ ౨-గన్నేరు మొదలైన వానియందు నొకకొమ్మయందుఁగానఁబడున నేక పుష్పములగుత్తి పేళ్ళు, A cluster of blossoms |
| కుట్మలో ముకులో (ఉ(స్త్రీ)యామ్) ॥౬౨॥ | కుట్మలః ॥పు॥-ముకులః ॥పు॥౨-అవురు వికసింపఁగల మొగ్గల పేళ్ళు- An opening bud. |
| (స్త్రియః)స్సుమనసః పుష్పం ప్రసూనం కుసుమం సుమమ్। | సుమనసః॥ స్త్రీ, బ॥-పుష్పమ్-ప్రసూనమ్-కుసుమమ్-సుమమ్॥న॥ ౫-పువ్వుల పేళ్లు, సుమనశ్శబ్దము ఏకవచనమును గలదు. A flower. |
| మకరన్దః పుష్పరసః | మకరన్దః- పుష్పరసః ॥పు॥ ౨-పూదేనె పేళ్ళు, The honey of flowers. |
| పరాగస్సుమనోరజః॥ ౬౩॥ | పరాగః॥పు॥-సుమనోరజః॥స్త్రీ, న॥౨-పుప్పొడి పేళ్ళు, The pollen of a flower farina. |
| (ద్విహీనం ప్రసవే సర్వం) | సర్వమ్=(రాఁగల్గువృక్షలతాదులు) అన్నియు ప్రసవే=పుష్పఫలవాచకమైనపుడు, ద్విహీనమ్=స్త్రీలింగపుల్లింగములు లేనిది నపుంసకమే యనుట. |

| | |
|---|---|
| (హారీతక్యాదయః స్త్రియామ్)॥ | హారీతక్యాదయః=హారీతకి, కోశాతకి మొదలైనవి, ఫలవే=పుష్పఫలవాచకమైనపుడు, స్త్రియామ్=స్త్రీలింగమునందు వర్తించును. |
| అశ్వత్థవైణవ ప్లాక్ష నైయగ్రోధైఙ్గుదం (ఫలే)॥ ౬౮॥ బార్హతం చ | అశ్వత్థమ్ – వైణవమ్– ప్లాక్షమ్– నైయగ్రోధమ్–ఐఙ్గుదమ్– బార్హతమ్॥న॥౬–వరుసగా అశ్వత్థాదివృక్షముల ఫలము పేళ్ళు. |
| (ఫలేజమ్బ్వా)జమ్బ్వాః (స్త్రీ)జమ్బుజామ్బవం॥ | జమ్బ్వాః॥సీ॥–జమ్బు–జామ్బవమ్॥ 3 –జమ్బ్వాః ఫలే=నేరేడుపండు పేళ్ళు. The rose apple fruit. |
| (పుష్పేజాతీప్రభృతయ స్స్వలిఙ్గా) | జాతీప్రభృతయః = జాతీమల్లికాశేఫాలికాది శబ్దములు, పుష్పే = పుష్పవాచకము లైనపుడు, స్వలిఙ్గాః=తమలింగములు గలవి; స్త్రీలింగము లే యనుట. |
| (వ్రీహయః ఫలే)॥ ౬౯॥ | వ్రీహయః =వ్రీహిమాషముద్గయవాదిశబ్దములు, ఫలే=ఫలవాచక మయినపుడు, స్వలిఙ్గాః=తమ లింగములు గలవి. పుల్లింగము లే యనుట. |
| (విదార్యాద్యా స్తుమూలేఽపి) | విదార్యాద్యాః= విదారీ గమ్భారీ మొదలైన శబ్దములు, మూలేఽపి=పుష్పమున కే గాక మూలమునకు వాచకములయినపుడును, స్వలిఙ్గాః=తమ లింగములు గలవి; స్త్రీలింగము లే యనుట |
| (పుష్పే క్లీబేఽపి పాటలా) | పాటలా= పాటలాశబ్దము,పుష్పే=పుష్పవాచకమయినపుడు క్లీబేఽపి=నపుంసకలింగమునందును, అపిశబ్దమువలన స్త్రీలింగమునందును వర్తించును. |
| బోధిద్రుమశ్చలదలః పిప్పలః కుఞ్జరాశనః॥ | బోధిద్రుమః – చలదలః–పిప్పలః–కుఞ్జరాశనః–అశ్వత్థః ॥పు॥ ౫–రావిచెట్టు, The holy fig-tree, Ficus religiosa. |
| అశ్వత్థే ఽథ కపిత్థే (స్యు)ర్దధిత్థగ్రాహిమన్మథాః॥ (తస్మిన్)దధిఫలః పుష్పఫలదన్తశఠావపి॥ | కపిత్థః – దధిత్థః –గ్రాహీ॥న్॥ – మన్మథః =దధిఫలః–పుష్పఫలః–దన్తశఠః ॥పు॥ ౭–వెలగచెట్టు, The wood-apple tree, Feronia elephantium. |
| ఉదుమ్బరే జన్తుఫలో | ఉదుమ్బరః – జన్తుఫలః – యజ్ఞాఙ్గః–హేమదుగ్ధః |

(తస్మింస్తుగిరిసమ్భవే)॥ అక్షోటకన్దరాలౌ (ద్వౌ)

అక్షోటః - కన్దరాలః ( పా ) కర్పరాలః॥పు॥ ౨-గిరిసమ్భవే తస్మిన్=కొండగోగు, juglans regia (పేళ్ళు, Alangium.

వక్షోటతు నికోచకః।

అఙ్కోటః-నికోచకః ॥పు॥ ౨- ఊడుగుచెట్టు

పలాశే కింశుకః పర్ణో వాతపోథో

పలాశః-కింశుకః - పర్ణః - వాతపోథః ॥పు॥ ౪- మోదుగచెట్టుపేళ్ళు, Butea frondosa.

(ఽథ) వేతసే॥ ౭౨॥ రథాభ్రపుష్పవిదుల శీత వానీరవఞ్జులాః।

వేతసః-రథః-అభ్రపుష్పః-విదులః-(పా)విదురః-శీతః- వానీరః-వఞ్జులః ॥పు॥ 3- ప్రబ్బలిచెట్టు పేళ్ళు, The rattan plant.

(ద్వౌ)పరివ్యాధ విదులౌ నాదేయీచామ్బువేతసే॥ ౭౩॥

పరివ్యాధః- విదులః- నాదేయీ॥సీ॥ అమ్బువేతసః॥పు॥౪- నీరుప్రబ్బలిచెట్టుపేళ్ళు.

శోభాఞ్జనే శిగ్రుతీక్ష్ణగన్ధకాక్షీబమోచకాః (రక్తోసౌ)

శోభాఞ్జనః - శిగ్రుః - తీక్ష్ణగన్ధకః - అక్షీబః - (ప) అక్షీబః-మోచకః॥పు॥-౫ మునగచెట్టుపేళ్ళు. Moringa Pterygosperma.

మధుశిగ్రుః (స్యాత్)

మధుశిగ్రుః॥పు॥౧-ఎఱ్ఱపువ్వుల మునగపేరు

దరిష్టః ఫేనిల(స్సమౌ)॥

అరిష్టః- ఫేనిలః॥ పు॥ 3- కుంకుడుచెట్టుపేళ్ళు, Soapnut tree.

బిల్వశాణ్డిల్య శైలూషా మాలూరశ్రీఫలావపి।

బిల్వః-శాణ్డిల్యః-శైలూషః-మాలూరః-శ్రీఫలః ॥పు॥౫- మారేడుచెట్టుపేళ్ళు, Egle Marmelos

ప్లక్షో జటీ పర్కటీ (స్యాత్)

ప్లక్షః-జటీ ॥న్॥ పర్కటీ॥ న్॥పు॥ (ప)జటీ-పర్కటీ॥సీ॥3-జువ్విచెట్టుపేళ్ళు,Ficus venosa.

న్యగ్రోధో బహుపాద్వటః॥ ౭౪॥

న్యగ్రోధః -బహుపాత్ ॥ద్॥- వటః॥పు॥3- మఱ్ఱిచెట్టు, Banyan or the Indian fig tree.

గాలవశ్శాబరో లోధ్రస్తిరీటస్తిల్వ మార్జనౌ।

గాలవః-శాబరః(పా)సాబరః- లోధ్రః-తిరీటః తిల్వః-మార్జనః- ॥పు॥౬-లొద్దుగుచెట్టు పేళ్ళు, Symplocos racemosa.

ఆమ్రశ్చూతో రసాలో

ఆమ్రః - చూతః - రసాలః ॥పు॥3- మామిడిచెట్టుపేళ్ళు, Mango tree.

| | |
|---|---|
| (ఉ-సా)సహకారో | సహకారః॥పు॥౧-అతిసౌరభః॥అసా=మిక్కిలివరిమ |
| (ఉ-తిసౌరభః॥ ౭౬॥ | ళము గలమామిడి, A very fragrant sort of mango |
| కుమ్భోలూ ఖలకే(క్లీ | కుమ్భమ్ - ఉలూఖలకమ్ ॥న॥-కౌశికః- |
| బే) కౌశికో గుగ్గులుః | గుగ్గులుః-పురః ॥పు॥ ౫ - గుగ్గిలపుచెట్టు పేళ్ళు, |
| పురః॥ | The baubul tree. Bdellium· కుమ్భోలూఖల |
| | కమ్- అని యేక నామముగాఁ గొందరందురు. |
| శేలుః శ్లేష్మాతక శ్శీత | శేలుః-శ్లేష్మాతకః-శీతః-ఉద్దాలః- బహువా |
| ఉద్దాలో బహువారకః | రకః॥పు॥ ౫-విరిగిచెట్టుపేళ్ళు, Gordia myxa. |
| రాజాదనం ప్రియాల | రాజాదనమ్॥న॥-ప్రియాలః (పా) పియాలః- |
| శ్చ సన్నకద్రు ర్ధనుః | సన్నకద్రుః - ధనుఃపటః (ప) ధనుపటః ॥పు॥ర- |
| పటః॥ | మోరటిచెట్టుపేళ్ళు, Ghironjia Sapida. |
| గమ్భారీ సర్వతోభ | గమ్భారీ - సర్వతోభద్రా - కాశ్మరీ - మధుప |
| ద్రా కాశ్మరీ మధుపర్ణి | ర్ణికా - శ్రీపర్ణీ-భద్రపర్ణీ-॥స్త్రీ॥ కాశ్మర్యః॥పు॥౭- |
| కా॥౮౧॥ శ్రీపర్ణీభద్ర | గుమ్మడుచెట్టుపేళ్ళు, Gmelina arborea |
| పర్ణీచ కాశ్మర్యశ్చా | |
| (స్య థ ద్వయోః)॥ | కర్కన్ధూః॥-ప్స॥బదరీ-కోలీ-ఘోణ్టా ॥స్త్రీ॥ర- |
| కర్కన్ధూ ర్బదరీ కోలీ | రేఁగుచెట్టుపేళ్ళు, మొదటి 3 ను గంగ రేఁగునకు |
| ఘోణ్టా | ను, ఘోణ్టాశబ్దము రేఁగుపండునకును పేళ్ళందురు. |
| కువలఫేనిలే॥౮౨॥ సౌ | కువలమ్- ఫేనిలమ్-సౌవీరమ్-బదరమ్- కోలమ్ |
| వీరం బదరంకోల | ॥న॥౫- రేఁగుపండుపేళ్ళు, Zizyphus jujuba. |
| (మధస్యా) త్స్వాదు | స్వాదుకణ్టకః- వికఙ్కతః- స్రువావృక్షః- |
| కణ్టకః॥ వికఙ్కత | గ్రన్థిః-వ్యాఘ్రపాత్ ॥ద॥పు॥ ౫- పుల్లవెలఁగ |
| స్స్రువావృక్షో గ్రన్థిలో | పేళ్లు, Flacourtia Sapida. |
| వ్యాఘ్రపాదపి ॥౮౩॥ | [పేళ్ళు, Orange. |
| ఐరావతో నాగరఙ్గో | ఐరావతః- నాగరఙ్గః॥పు॥౨- నారదపుచెట్టు |
| [illegible] । భూమిజ | నాదేయీ- భూమిజమ్బూకా॥స్త్రీ॥ ౨ - కాకినేరేడు |
| [illegible] | పేళ్ళు. ఈ ర- నారదము పేళ్ళందురు. |
| తిన్దుక స్స్ఫూర్జకః కాల | తిన్దుకః-స్ఫూర్జకః-కాల స్కన్ధః- శితిసారకః॥ |
| స్కన్ధశ్చశితిసారకే॥౮౪॥ | పు॥ ర-తుమికిచెట్టు పేళ్ళు, Dicspyros glutionsa. |

| | |
|---|---|
| నదీసర్జో వీరతరు రిన్ద్రిద్రుః కకుభోఽర్జునః॥ | నదీసర్జః - వీరతరుః - ఇన్ద్రద్రుః - కకుభః - అర్జునః॥పు॥ ౫-ఏఱుమద్దిచెట్టు పేళ్ళు. |
| రాజాదనఫలాధ్యక్షే క్షీరికాయాం (మథధ్వయోః)॥౬౧॥ | రాజాదనమ్- ఫలాధ్యక్షమ్॥న॥- క్షీరికా॥స్త్రీ॥ 3-పాలచెట్టు పేళ్ళు. |
| ఇఙ్గుదీ తాపసతరు | ఇఙ్గుదీ॥స్త్రీ॥- తాపసతరుః॥పు॥ ౨- గారచెట్టు పేళ్ళు- పుల్లింగమునందు ఇఙ్గుదః, Bramble. |
| ర్భూర్జేచర్మిమృదుత్వచౌ। | భూర్జః- చర్మి॥న్॥- మృదుత్వక్॥ చ్॥పు॥ 3-భుజపత్రిపుచెట్టుపేళ్ళు, The birch tree. |
| పిచ్ఛిలాపూరణీమోచాచిరాయుః శ్శాల్మలి (ర్ద్వయోః)॥౬౨॥ | పిచ్ఛిలా-పూరణీ- మోచా॥స్త్రీ॥- చిరాయుః-(పా) స్థిరాయుః ॥న్, న॥- శాల్మలిః॥ (పా) శల్మలిః॥స్త్రీ॥౫-బూరుగుచెట్టుపేళ్ళు, Silk-cotton tree. |
| పిచ్ఛాతుశాల్మలీ వే ష్టే | పిచ్ఛా॥స్త్రీ॥- శాల్మలీవేష్టః॥పు॥ ౨- బూరుగు బంక పేళ్ళు, Its gum. [బూరుగుపేళ్ళు. |
| రోచనః కూటశాల్మలిః। | రోచనః॥పు॥-కూటశాల్మలిః॥పు॥౨- కొండ |
| చిరిబిల్వోనక్తమాలః కరజశ్చ కరఞ్జకే॥౬3॥ | చిరిబిల్వః - నక్తమాలః (పా) నక్తమాలః-కరజః-కరఞ్జకః॥పు॥౪-కానుగు పేళ్ళు, Galedupa Arborea. |
| ప్రకీర్యః పూతికరజః పూతికః కలిమారకః। | ప్రకీర్యః (పా) ప్రకీరః-పూతికరజః-పూతికః-కలిమారకః (పా) కలికారకః ॥పు॥ ౫ -తెల్లగచ్చ యుడుగుచెట్టుపేళ్ళు, Gray Bondue. |
| (కరఞ్జభేదా) ష్షడ్గ్రన్థో మర్కట్యఙ్గారవల్లరీ॥౬౪॥ | షడ్గ్రన్థః॥పు॥-మర్కటీ- అఙ్గారవల్లరీ ॥స్త్రీ॥ ఈ 3 ను వరుసగా ఆరుగంట్లు గల కానుగునకును తీగెకానుగునకును, నిప్పువన్నె గుర్తులుగల కానుగునకును పేళ్ళు. |
| రోహీరోహితకః ప్లీహశత్రు ర్దాడిమపుష్పకః। | రోహీ॥న్॥-రోహితకః-ప్లీహశత్రుః- దాడిమపుష్పకః॥పు॥౪-ములుమోదుగు పేళ్ళు. |
| గాయత్రీ బాలతనయః ఖదిరోదన్తధావనః॥౬౫॥ | గాయత్రీ॥స్త్రీ॥(ప)గాయత్రీ॥న్॥- బాలతనయః-ఖదిరః-దన్తధావనః ॥పు॥ ౪-చండ్రచెట్టుపేళ్ళు, Mimosa Catechu. |

అరిమేదో విట్ఖదిరే

అరిమేదః - విట్ఖదిరః॥పు॥౨-దుర్గంధము గల చంద్రచెట్టు, వెలితుమ్మపేళ్ళని కొందఱందురు. A fetid mimosa. A white mimosa

కదరః(ఖదిరేసితే)। సోమవల్కో౾౽

కదరః_సోమవల్కః॥పు॥౨-వెలిచంద్రపేళ్ళు

(వ్యథ) వ్యాఘ్రపుచ్ఛ గన్ధర్వహస్తకౌ ॥౬౬॥ ఏరణ్డ ఉరుబూకశ్చరుచకశ్చిత్రకశ్చ (నః) । చఞ్చుఃపఞ్చాఙ్గులోమణ్డ వర్ధమానవ్యడమ్బకాః॥

వ్యాఘ్రపుచ్ఛః- గన్ధర్వహస్తకః ఏరణ్డః- ఉరుబూకః-రుచకః॥-(పా) రుబుకః-చిత్రకః-చఞ్చుః-పఞ్చాఙ్గులః-మణ్డః-వర్ధమానః - వ్యడమ్బకః॥పు॥ ౧౧-ఆముదపుచెట్టుపేళ్ళు, Palma christi, Ricinus communis.

(అల్పాశమీ) శమీ ర(స్స్యాత్)

శమీరః॥పు॥౧-అల్పాశమీ= పిన్నజమ్మిచెట్టు పేరు. Mimosa albida.

శమీసక్తుఫలాశివా। పిణ్డీతకో మరువక శ్శ్వసనః కరహాటకః॥౬౮॥ శల్యశ్చ మదనే

శమీ-సక్తుఫలాశివా॥సీ॥ 3- జమ్మిచెట్టుపేళ్ళు, పిణ్డీతకః- మరువకః- శ్వసనః- కరహాటకః-శల్యః- మదనః ॥పు॥౬ - మంగ చెట్టు పేళ్ళు, Vangueria spinosa or Gardenia dumetorum.

శక్రపాదపః పారిభద్రకః। భద్రదారు ద్రుకిలిమం పీతదారుచదారుచ॥ పూతికాష్ఠంచ(స ప్తస్యు ర్దేవదారు ణ్యథద్వయోః) । పాటలిః పాటలా౾మోఘా కాచస్థాలీ ఫలేరుహా॥ కృష్ణవృన్తా కుబేరాక్షీ।

శక్రపాదపః- పారిభద్రకః॥ పు॥ భద్రదారు-ద్రుకిలిమమ్-పీతదారు (పా) పూతిదారు-దారు-పూతికాష్ఠమ్॥న॥ ౭- దేవదారు వృక్షము. దేవదారుశబ్దము॥ ప్న ॥ Uvaria longifolia; Commonly called *deodor*.

పాటలిః॥ప్ర॥పాటలా-అమోఘా- (వ) మోఘా-కాచస్థాలీ(పా) కాలస్థాలీ- ఫలేరుహా- కృష్ణవృన్తా- కుబేరాక్షీ॥సీ॥ ౭-కలిగొట్టు చెట్టు పేళ్ళు The trumpet flower. Bignonia suave-olens.

శ్యామాతు మహిలాహ్వాయా।లతాగోవన్దినీ గున్ద్రా) పియఙ్గుః ఫలినీ

శ్యామా-మహిలాహ్వయా-లతా- గోవన్దినీ గున్ద్రా) - ప్రియఙ్గుః -ఫలినీ-ఫలీ- విష్వక్సేనా-గన్ధఫలీ- కారమ్భా॥ సీ ॥ప్రియకః॥పు॥ ౧౨-

